ఓం శ్రీ లక్ష్మీదేవతాయైనమః

# కలుముల జవరాల

# శతకము



కృతికర్త:

కోసంగి సిద్ధేశ్వరప్రసాద్

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

మే నెల 1995

మూల్యము రు. 7/-లు.

ప్రతులకు:

కోసంగి సిద్ధేశ్వరప్రసాద్
2/75. మెయిన్ బజారు,
రైల్వే కోడూరు-516 101. కడప జిల్లా.
ఆంధ్రప్రదేశ్.

ముద్రణ:

శ్రీ షిరిడి సాయిబాబా ప్రింటర్స్
తులసి కాంప్లెక్స్, రైల్వే కోడూరు,
కడప జిల్లా. - 516 101.

# గ్రంథ ముద్రణ దాతలు



**కీ॥ శే॥ చవ్వామరెమ్మగారి రామచంద్రారెడ్డిగారు**

**వారి జ్ఞాపకార్థం వారి ధర్మపత్ని ఈశ్వరమ్మగారు**

**వారి సుపుత్రులు, దయాగుణ సంపన్నులు, దానగుణశీలురు,**

**సి. ఎం. బలరామిరెడ్డిగారు,**

**సి. ఎం. రామనాథరెడ్డిగారు,**

**పి. ఎం. రామసుధాకరరెడ్డిగార్లు.**

# అభిప్రాయాలు - ఆశీస్సులు

అధికార భాషా సంఘం
ఆంధ్రప్రదేశ్.

పద్మశ్రీ కళాప్రపూర్ణ ☎ : కార్యాలయం 33765
డా॥ సి. నారాయణరెడ్డి నివాసం 63063
ఎం. ఏ., పి హెచ్., డి., డి. లిట్., సచివాలయం
అధ్యక్షుడు హైదరాబాద్-500 022

13 - 11 - 1982

శ్రీ సిద్ధేశ్వర ప్రసాద్‌గారికి,

మీరు కలుముల జవరాల శతకం పంపి తొలిపలుకు వ్రాయమన్నారు. నిజానికి ఈ శతకానికి మీ ప్రతి పద్యం ఓ తొలిపలుకు.

కారణం "మీ భక్తి రచనలు మీవిగాన" కలుముల జవరాలి బహుముఖ మహిమలను పరవసించి ఈ పద్యాల రూపములో స్తోత్రం చేసి మీ భక్తిని చాటుకొన్నారు. సంతోషం.

సి. నా. రెడ్డి.

---

## శుభాకాంక్షలు

కవి తన రచనా వ్యాసంగమున మైమరచి, తన్మయుడై తాదాత్మ్యమును బొంది కవితా స్రవంతిని వెలువరించును. అదియే కవితా తపస్సు. కావుననే పెద్దలు "నా నృషిః కురుతే కావ్యం" అని వాక్రుచ్చిందురు అట్టి యేకాగ్రత యున్నప్పుడే—వస్తువు దానికి సరిపడు భావము—భావమునకు తగిన భాష సమకూర్చుటకు వీలగును లేనిచో నిష్ఫలమే! అట్టి కవి కావ్యమే రసికుల హృదయాంతరాళాలలో గిలిగింతలు పెట్టి ఆనందమును, హాయిని గలిగించును.

నా మేనల్లుడు చి॥ కోసంగి సిద్ధేశ్వరప్రసాదు అట్టి తపస్వి యనవచ్చును. స్వయంకృషిచేత కవిత్వ మలవరచుకొన్నవాడు.

పెద్ద మేనమామ వేదం వేంకటకృష్ణశర్మగారి యంద కొంతయుంద వచ్చును. బృహద్గ్రంధములకు పూనుకొనక కొన్ని శతకములను రచించినాడు. అందీ *కలుముల జవరాల శతక* మొకటి. ఈ శతక రచనకై విషయ సేకరణ కతడు చాలా కృషి చేసి యుండ వలెను. శతకమును గూర్చి కావలసిన విషయములన్నియు — వైదిక పౌరాణిక గాధలు పూజా విధానము — వివరింప బడినవి. ఏ యే దేశమున నే యే విధముగ నే రూపమున లక్ష్మి యారాధింప బడెనో నిర్వచింప బడినది. అష్ట లక్ష్ముల గూర్చియు తెలుపబడినది. ఇట్లు అనేక విషయములీ శతక మూలమున గ్రహింప గలుగుటకు వీలగుచున్నది. ఒక్కొక్క పద్యము ఒక్కొక్క ప్రత్యేక గాధగా నెంచ వచ్చును.

ఇట్టి చారిత్రక, పౌరాణిక విషయములనేకాక భక్తి భావములను రేకెత్తించు శతక రచన చేసిన మా సిద్ధేశ్వర ప్రసాదు ధన్యజీవి. శ్రీ వేంకటగిరి వల్లభు డతనికి దీర్ఘాయు రైశ్వర్యము లొసగు గాక! యని ప్రార్థించుచున్నాను.

మద్రాసు — రసపిపాసి

27-10-90 — వేదము చంద్రశేఖరయ్య

---

లలిత కళానిధి ఎం. వి. సుబ్రహ్మణ్యం విద్వాన్ & ఆర్టిస్టు

## నా ముచ్చట

మా మిత్రులు శ్రీ సిద్ధేశ్వరప్రసాద్ గారు రచించిన ఈ శతకము శ్రీమన్నారాయణుని పత్ని *కలుముల జవరా* లైన శ్రీమహాలక్ష్మిని గూర్చి వేదపురాణ చరిత్ర కాంశాలను తెలియజేస్తూన్నది. శతక వాఙ్మయంలో నిటువంటి శతకములరుదు.

సరళ రచన శ్రీదేవీ సంబోధనాత్మకమైన దేవీ స్తోత్ర నామావళి యెడనెడ పద్యాల్లోనున్నది. వాని పఠనమున పాఠకుడు భక్తి

భావాన్ని పెంపొందించుకొనగలఁడు— దైవ సంస్మరణమే మానవుని జీవిత పరమావధి గదా!

ఇటువంటి రచన మనకందించిన వీరు ధన్యులు. పఠించెడు మనము ధన్యులము. నా ముచ్చట మన్నించి ఆయురారోగ్య భాగ్యములతో వీరిని శ్రీనివాసుడు కాపాడుగాక!

మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యాం
బుడుగుంటపల్లె, రైల్వే కోడూరు (పోస్టు) 1-12-1983

---

బి. వి. నారాయణ, బి. ఎ; బి. యిడి; జడ్. పి. హైస్కూలు
ప్రధానోపాధ్యాయులు. ముక్కావారిపల్లె.

## ఆశయం

శ్రీ కారుణ్య గుణాకరుః దేకైక జగత్ప్రభుండనే కాశ్రితసత్।
శ్రీ కరుఁడు శివుఁడు బ్రోచును। శ్రీ కోసంగి కులభూష సిద్ధేశ్వరునిన్॥

తేట తెనుగు లోన తేట గీతలు వ్రాసి
ఖ్యాతి గాంచినట్టి కవి వరేణ్య!
తారలున్నదనుక ధరణిలో మీ పేరు
నిలచి వెలసియుండు నిజము నిజము॥

మీరు వ్రాసిన శతకాల తీరుచూడ
భక్తిభావాలు భాసిల్లు భద్రముగను
భక్తపోతన కోవలో బ్రతుకనెంచి
నట్టు లొనరించినట్లు ప్రత్యక్ష మగును॥

సీస పద్యంబుల శ్రీకారమును జుట్టి
తేట గీతలలోన దీప్తిగాంచి
ఆటవెలదులను నాడించి పాడించి
వృత్తంబు లందున విలువ నెరపి
కంద పద్యములందు - విందుల నందించి
గద్యంబు లందున ఘనత జాటి
మానిత సినిమాల మనసార నటియించి
వేష భాషలలోన విలువ బడసి

నాటకములలోన పాటవంబును జూపి
జ్యోతిషాన మిపుల సూక్ష్మమరసి.
నీతి పథములోన నిలచిన కవిరాజ
వందనములు మీకు వందనములు

కలుముల జవరాలాఖ్యను వెలసెడు శతకంబు నెవడు విడువక జదువన్
కలిమిన్ సౌఖ్యపదంబుల కలుముల జవరాలొసగి కావుత ధరణిన్॥

బి. వి. నారాయణ
15-4-1995

---

ఓం శ్రీ శివః

## విజ్ఞాపనము

అమ్మ శ్రీదేవి నిన్ను నే నాత్మనెంచి
కలుముల జవరాల శతక కావ్యమిదిగో
అంకితం బిచ్చితిన్ ప్రీతి నందుకొనుము
విష్ణు వక్షస్థల స్థితా విజయలక్ష్మి॥-

రామచంద్రు సుపుత్రు లౌర! బలరామ
రామనాథ సుధాకరుల్ రాణరెట్లు
చవ్వ మర్రెమ్మ వంశాబ్ధి చంద్రులైరి
కావ్యముద్రణ దాతలై కలుగు శుభము! ॥-

శ్రీ వరలక్ష్మీ పూజను జరిపించుటకై శ్రీయుతులు పి. ఎం. రామసుధాకరరెడ్డిగారు పిలువనంపగా వెళ్ళితిని. భక్తి ప్రపత్తులతో దైవపూజ జరిగినది. ఉత్తమ సాధ్వి కుం॥ శ్రీ॥ సౌ॥ తులసీరామ సుధాకరరెడ్డిగారితో సవినయముగ కలుముల జవరాల శతకము ముద్రణమును గూర్చి తెలుపుకొంటిని. అడిగినదే తడవుగ శతకమును ముద్రింపించి యిచ్చుటకు అంగీకరించినారు. దాతృత్వమన్న నదిగదా! శ్రీమతి తులసిగారు వారి మామగారు కీ॥ శే॥ చవ్వామరెమ్మగారి రామచంద్రారెడ్డిగారి జ్ఞాపకార్థము వారి కుమారులు ప్రముఖవ్యాపార వేత్తలు, దయాగుణ సంపన్నులు, దానగుణ శీలురు శ్రీ పి. ఎం. బలరామిరెడ్డిగారు, శ్రీ పి. ఎం. రామనాథరెడ్డిగారు, శ్రీ పి. ఎం. రామసుధాకరరెడ్డిగార్లు ఈ గ్రంథమును ముద్రింప జేతురని పాయ మొనర్చిరి.

వరలక్ష్మీదేవియే! (కలుములజవరాలే!) తన గ్రంథమును ముద్రింప జేసికొన్నదని మనస్పున నమస్కరించుకొంటిని. " దైవం మానుష రూపేణ " యను నానుడి యున్నదిగదా! వారిని ఆయురారోగ్యములతో, సిరిసంపదలతో, భోగభాగ్యములతో, పుత్ర పౌత్రాభివృద్ధిగ నలరారవలెనని ఆ " కలుముల జవరాలిని " ప్రార్థించుచున్నాడను.

ఈ గ్రంథమును గూర్చి సదభిప్రాయములొసంగి ఆశీర్వదించిన ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం అధ్యక్షులు పద్మశ్రీ కళా ప్రపూర్ణ డా॥ పి. నారాయణరెడ్డిగారికి, మా మేనమామ విద్వాన్ వేదము చంద్రశేఖరయ్యగారికి, మిత్రులు లలితకళానిధి ఆర్టిస్టు

విద్వాన్ మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యంగారికి, ఈ గ్రంథమును సర్వాంగ సుందరముగా ముద్రింపించి సకాలమునకు మనకందించిన శ్రీ షిరిడి సాయిబాబా ప్రింటర్స్ అధినేత శ్రీ ఆదనుకోట నరసింహులుగారికి అనేక కృతజ్ఞతాభివందనములు.

ముద్రణమైన నా రచనలు * ఈశ్వరస్తవము * * గుడాల కోన మహత్మ్యం * * బాలమిత్ర శతకము * * విఘ్నరాజ శతకము * లను ఆదరించినట్లే సహృదయులెల్లరు ఈ గ్రంథమును కూడ సమాదరింతురని నమస్కార పూర్వకముగా విజ్ఞాపనము చేసికొనుచున్నాడను.

కృష్ణవేణీ నిలయం.
రైల్వే కోడూరు.
27-3-95

వినీతుడు.
కోసంగి సిద్ధేశ్వర ప్రసాద్



శ్రీ షిరిడి సాయిబాబా ప్రింటర్స్, కోడూరు.

శ్రీ శివ!



కృతికర్త:

కోసంగి సిద్ధేశ్వరప్రసాద్

రైల్వే కోడూరు, కడప జిల్లా.

# కలుములజవరాల శతకము

శ్రీ రమా! శుభదాయిని! సిద్ధలక్ష్మి!
యష్టభాగ్యప్రదాయిని యాదిలక్ష్మి!
విశ్వ నిర్మాణ కారిణీ విజయలక్ష్మి
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 1

అమ్మ! శ్రీదేవి! నిన్నాత్మ నర్చచేసి,
నూట పదునాఱు పద్యాల నుతియొనర్తు!
సకల సంపత్స్వరూపిణీ! స్వాగతమ్మ!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 2

ఓ మహామాయ! శ్రీ పీఠ! కామజనని!
నిత్య యౌవన సౌందర్య! నిత్యపుష్ట!
శంఖ చక్ర గదాహస్త! సర్వశస్త!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 3

పద్మ! పద్మజ! పద్మాక్షి! పద్మహస్త!
పద్మముఖి! పద్మసుందరి! పద్మగంధి!
పద్మభవుమాత! పద్మిని! పద్మనిలయ!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 4

సర్వకర్మ ప్రవర్తిని! సర్వశక్తి!
సర్వమంగళ సంపన్న! సర్వవర్ణ!
విష్ణుపత్ని! హిరణ్మయి! విశ్వమాత!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 5

భోగ వైభవ సంధాత్రి! మోక్షలక్ష్మి
సర్వరోగ వివర్జితా! సర్వజనని!
నిత్య దారిద్ర్య నాశిని! సత్య చరిత!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 6

దివ్య! పద్మాసనస్థిత! భవ్యసేవ్య!
నిత్య కళ్యాణి! నిర్ద్వైత! నిత్యతృప్త!
లోక శోక నివారిణి! లోల! విమల!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 7

పూర్ణచంద్ర ప్రతీకాశ! భోగ్యదాత!
పంచభూతాధిదేవత! ప్రణుతచరిత!
నిర్మలజ్ఞాన సంవేద్య! నిగమ వినుత!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 8

పద్మకర ప్రసన్న వదన! పద్మ చిహ్నా!
ప్రణవనేత్రి! పరమశివ! ప్రాప్తయోగ!
రత్నభూషణ! హ్లాదిని! రమ్యభాష!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ 9

బాల బ్రహ్మాండ మణిభూష! పరమపుణ్య!
శుక్ల మాల్యాంబర! విభవ! సుప్రసన్న!
భక్త జనరంజనీ! పరబ్రహ్మమూర్తి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 10

యజ్ఞకర్మ స్వరూప। యాద్యంత రహిత।
యోగ సంభూత। యోగజ్ఞ। యోగమూర్తి।
భాగ్యదాయిని। పరమార్థ। భవ్యచరిత।
కలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ 11

సర్వదుష్ట భయంకరి। సర్వవంద్య।
సర్వ సంపత్తి సంధాత్రి। సర్వశాస్త్ర।
సర్వగుణ పూర్ణ। సర్వజ్ఞ స్త్రైణసౌమ్య।
కలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ ॥ 12

సకల జనని। సనాతని। సర్వభద్ర।
బిందునాద కళాతీత। వేదచరిత।
రంగనాయిక। రాజిత। రాజయోగ।
కలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ ॥ 13

యోగ గమ్య। శుభావహ। భోగదాత్రి।
సర్వతోభద్రవాసిని। స్వప్రకాశ।
కాంచనాంబర ధారిణి। కమలనేత్ర।
కలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ 14

ఇందు సోదరి। జగములనేలుతల్లి।
అల సరస్వతీ శివలతో నాడు లక్ష్మి।
కమల హరిరాణి పుణ్యాల కలిమి పంట।
కలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ ॥ 15

పాలకడలిని శేషతల్పంబుమీఁదఁ
బవ్వళించిన శ్రీహరి పజ్జఁజేరి
ముచ్చటలుసెప్పి లోకాలఁ బ్రోచుతల్లి।
కలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ ॥ 16

హేమ కుంభాలతో నేన్గు లెసఁగుచుండ
నంబుజాల్ పసిఁడికలశ మభయముద్ర,
కనక చేలాల వెల్గెదు కమలమందుఁ,
గలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ ॥ 17

మాటలిచ్చెడు తల్లి మామంచి తల్లి
వాణి నీ కోడలు గదమ్మ। వనరుహాక్షి।
అత్తకోడండ్ర మిమ్మెంతు బత్తి మీరఁ
గలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ ॥ 18

సర్వసంపదలీయంగఁ జాలెదంచు
నన్నిలోకాల ధ్యానింతు రధికభక్తి,
దివ్యమైనట్టి నీ దయాదృష్టి కొఱకుఁ
గలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ ॥ 19

ముద్దుమోమునఁ జిఱునవ్వు మొనసియాడ
విష్ణుదేవుని కౌగిట వేడ్కనుండి
భక్తజనులను గాపాడు భద్రలక్ష్మి
కలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ ॥ 20

అంబ! లక్ష్మి! త్రైలోక్య కుటుంబిని! జల
జాతవాసిని! నీ కటాక్షమున వెలయు
నజహరిహరేంద్రుల జనని! యాదిశక్తి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 21

అబ్ధిపుత్రి! లోకైక దీపాంకుర! పర!
శ్రీద! శ్రీరంగధామేశ్వరీ! విశుద్ధ!
సర్వదేవాంగనా! సంసేవ్య! సగుణలక్ష్మి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 22

భక్తజనులకు సిరులీయ భాగ్యలక్ష్మి!
గరుడ వాహనంబున నీవుకదురయాన
విష్ణుదేవుని తోఁగూడి వెడలెదమ్మ!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 23

సుతుఁడు పరమేష్ఠి; భర్త విష్ణుండు మఱియు;
శంకరుఁడె సోదరుండయ్యె నింకనేమి?
యెంచ సృష్టి స్థితి లయమ్ము లెంతనీకు?
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 24

సర్వభూషణాలంకృతన్ సర్వలోక
సహజ సౌందర్య సౌభాగ్య సౌష్ఠవమున
శౌరి హృదయాబ్జమున నిల్చి జగతినేలు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 25

గాథలెన్నెన్నియో నినుగూర్చి కలవుతల్లి!
తెలిసినవి నేను భక్తితోఁ బలుకు వాఁడ
జిత్తగింపుము హరిరాణి! సిరులనిమ్మ
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 26

"స్త్రీ" కలిగెఁ గృష్ణు నందుండి సృష్టిమొదట!
రమణి రెండయ్యె 'లక్ష్మి' యు 'రాధ' యనఁగ
లక్ష్మిఁబెండ్లాడె విష్ణుఁడా లక్ష్మివీవె
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 27

శక్రు సంపద దూర్వాసు శాప వశత
నుదదిఁబడె; దేవదానవు లుదధిఁ జిలక
నందు జన్మించితివి తల్లి యబ్జ నిలయ
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 28

బృందకై హరి తులసిని వెలయ ననుచుఁ
దులసి నుందువు "శ్రీలక్ష్మి తులసీ" యగుచు
భక్తిఁ గొలుతురు తులసినిఁ బడతులెల్ల!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ 29

బాధపడు విప్రులేమినిఁ బాపగూబ
యతని యిలుదక్క నన్నింట నలవఁదొడఁగ
నీవు చేరితివతనింట నిండె సిరులు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 30

పెళ్ళిఁదలఁచిన యింటికి వెడలనీక
యడ్డపడుచుండు గూబను నాదరించి
వాహనంబుగఁ గొంటివో వార్ధితనయ!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥

విష్ణు శాంతము నెఱుఁగంగ వెడలి భృగుఁడు
తన్నె నెదపైని; శాంతానఁ దనరె శౌరి!
కలఁగి, యలఁగి, కొల్లాపురిన్ నిలచి తీవు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 32

హరినినుఁ బరిహసింప నీవాగ్రహించి,
శిరమునూడిపోఁ బల్కితి; హరియునంత
హయశిరమున హయగ్రీవుఁడయ్యెనంట
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ 33

చెలఁగ నీవాదిలక్ష్మియుఁ, జెంచులక్ష్మి
యనఁగ నరసింహు పత్నిపై యలరినావు;
భక్తవరదాయినీ! నీవె ప్రాపునాకుఁ
గలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 34

విష్ణుఁగోరి తపమొనర్చు వేదవతిని
రావణుఁడు చెనక శపించి, రమణి కూలె
నగ్నిః వానిఁజంపన్ బుట్టెఁ; నామె నీవె!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ 35

లంక బుట్టి మిథిల జేరి రాజుజనకు
పట్టి సీతవై శ్రీరాము జెట్టివట్టి
రావణుని జంప జేసితి రమణి మిన్న,
కలుముల జవరాల! కరుణ గావుమమ్మ ॥ 36

ద్వాపర యుగాన గృష్ణు నుద్వాహమాడ
భీష్మక సుత రుక్మిణివయి వెలసినావు
భక్తి దులసి మహాత్మ్యంబు పలికినావు ॥
కలుముల జవరాల! కరుణ గావుమమ్మ ॥ 37

నీదు ధవునికి నడుకుల నిండుభక్తి
బెట్టిన కుచేలు లేమిని నెట్టివైచి,
సంపదలనిచ్చి బ్రోచితి సమయమెఱిగి
కలుముల జవరాల! కరుణ గావుమమ్మ ॥ 38

విష్ణు శాపాన నశ్వమై వెలసినావు
నతని ధ్యానింప నాతడు నశ్వమయ్యె
అట్టి మీకు బుట్టినవాడె హైహయుండు,
కలుముల జవరాల! కరుణ గావుమమ్మ ॥ 39

ఆయురారోగ్య దాయి య య్యాదిశక్తి
నీ సహోదరు శివుపత్నియే గదమ్మ!
వదినె మరదంద్రు మాకిందు వరములింత
కలుముల జవరాల! కరుణ గావుమమ్మ ॥ 40

నీ కలా లేశమునఁ గదా విర్జరేంద్రుఁ
డాది దిక్పాలకులును, బ్రహ్మయు, శివుండు
నీక పాలించు చుందురు లోకములను
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 41

అమ్మ! శ్రీలక్ష్మి! నా యెద నాదివిష్ణు
నిల్పెఁదనకళ దయతోడ నిశ్చలముగ,
నట్లె నాయందు నీకళలమరవిమ్మ
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 42

సుజన వందిత! శుభకరి! సుగుణవల్లి!
మౌనిసేవిత! మాధవి! మంజుభాషి!
అంబుజావాస! జయజయ ఆదిలక్ష్మి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 43

ఇందు సోదరి! మోక్షదా! హేమమాలి!
పంకజాసని! మధుకైటభారి రాణి!
అష ్టభైరవి! జయజయ యాదిలక్ష్మి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 44

క్షీర సాగర భవ! సురసేవ్య! లక్ష్మి!
బ్రహ్మ విష్ణు శివాత్మికా! ప్రణవలక్ష్మి!
తత్వమర్థస్వరూపిణీ! ధాన్యలక్ష్మి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 45

మంగళ స్వరూపిణీ! సర్వమంత్రవాణీ।
సర్వమంగళ మూర్తి। శ్రీచక్ర రాజ్ఞి।
ధన్య! భక్త మానస హంసి, ధాన్యలక్ష్మి।
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 46

మంత్రమయి, పరదర్శిణీ, మంత్రహృద్య,
భార్గవీ, భయనాశినీ, భవ్యచరిత,
ద్రష్ట, శ్రీ యంత్రవాసిని, ధైర్యలక్ష్మి.
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 47

సాధు పోషిణీ, సద్యశా, జ్ఞానమూర్తి।
శక్తి, శీఘ్రఫలప్రద, శాస్త్రవినుత!
తాపసారాధ్య, సమ్మాన్య, ధైర్యలక్ష్మి,
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 48

ప్రథిత చతురంగ మండిత, పరిజననుత,
శాంతమయి, పాపనాశిని, సౌమ్యమూర్తి,
సర్వసంపన్న, గజలక్ష్మి,జయము జయము,
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ 49

హరి హర బ్రహ్మ పూజిత, యప్రమేయ।
తాపహారిణీ, తత్వజ్ఞ, తత్వరూప,
జగతి రక్షించు గజలక్ష్మి, జయము జయము,
కలుముల జవరాల। కరుణఁ గావుమమ్మ ॥ 50

కమల! యమల! సప్తస్వర గానలోల!
దేవదానవ మునిజనసేవితపద!
జ్ఞానదాయిని! జయము! సంతానలక్ష్మి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 51

చక్రిణీ! గజవాహన! సుప్రసన్నలక్ష్మి!
గుణగణాన్విత! మోహిని! కోవిదనుత!
తల్లి తల్లి! జయమ్మ! సంతానలక్ష్మి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 2

లోకహిత! రాగవర్ధిని! నాకనిలయ!
సర్వసిద్ధాంత మార్గస్థ! సర్వవినుత!
గానసన్నుత! జయము! సంతానలక్ష్మి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 53

కుంకుమాలంకృతప్రియా! కోమలాంగి!
పూజ్యశంకరదేశిక పూజితాంఘ్రి!
విశ్వనాయిక! జయ జయ! విజయలక్ష్మి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 54

వాణీ! జ్ఞానవికాసిని! వాగ్విలాస!
కనకధారాస్తవామోద! వనజగేహ!
సత్యరూప! విజయలక్ష్మి! జయము జయము!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 55

సరసహాస విలాసిని! సరసిజాక్షి!
నతసురేశ్వరి! భారతి! నాదరూప!
విశ్వధాత్రి! విద్యాలక్షి! వినతిగొనుమ!
కలుముల జవరాలు కరుణఁ గావుమమ్మ ॥ 56

రత్నమయ! చారుభూషణ! రాగహృదయ!
కలినివారిణీ! శ్రీవాణి! కామ్యఫలద!
చారుహాస! విద్యాలక్షి! జయము జయము!
కలుముల జవరాలు కరుణఁ గావుమమ్మ ॥ 57

ధిమి ధిమిధిమి ధింధిమి ధిమి ధింధిమి ధిమి
దుందుభీ నాదమోదినీ! ఇందువదన!
వైదిక సుమార్గ! ధనలక్షి! పరమజయము!
కలుముల జవరాలు కరుణఁ గావుమమ్మ ॥ 58

భంభ భంభంభ భంభంభ భంభ, దివ్య
శంఖనాద వినోదినీ! సరస చరిత!
వేదపూజిత! ధనలక్షి! విమల జయము!
కలుముల జవరాలు కరుణఁ గావుమమ్మ ॥ 59

శ్రావణంబున శుక్రవారములయందు
భరత ఖండాన సతులెల్ల పరమ భక్తి
నోచుకొందురు నిన్నుఁగూర్చి నోము తల్లి!
కలుముల జవరాలు కరుణఁ గావుమమ్మ ॥ 60

మామిడాకులు నర‘టి కంబములు గట్టి
పూలు పూసల జాలరుల్ పొస‘గ‘ గూర్చి
పాలవెల్లిని వరలక్ష్మి భక్తినుంత్రు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 61

కన్నులను ముక్కు‘ దీర్చిన కలశమువను
యవలతోనింపి, పంచపల్లవములుంచి,
పైని టెంకాయ‘బెట్టి రూపమ్ము‘ గూర్తు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 62

వేడ్క‘ గూర్చిన యాపాలవెల్లియందు
ముగ్గులను దిద్ది బియ్యమ్ముపోసి పైనిఁ
గలశముంచి పూజింతురు కాంతలు నిను
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 63

ధూప దీప నైవేద్యాలతోడఁ గొలచి,
తాల్చి తోరాల వాయన దానమిచ్చి,
నోచి విందురు వరలక్ష్మి నోము కథను
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 64

చారుమతి యను బ్రాహ్మణ సతి యొకర్తె
చేసి వరలక్ష్మి వ్రతమును సిరులనందె!
భక్త జనులకు ముంగొంగు పసిఁడి వీవు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 65

నీదు పుట్టు పూర్వోత్తరాల్ నేర్పు మెయిని,
నెందరెందరో పల్కిరెన్నెన్నో గతుల
నన్ని తలఁచి నేఁ బ్రార్థింతు నిన్ను సతము
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 66

భక్తిఁ గార్తికామావాస్యఁ బ్రతిగృహాన
దీపములు వెట్టి నీరాక తెలియ కొఱకుఁ
బూజ లొనరింత్రు భారత భూమియందుఁ
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 67

కొందఱు పటమ్ములను మఱి కొందఱెన్న
విగ్రహంబులఁ గొల్తురు విదితముగను.
భక్తజనమోదినీ! నిన్ను భక్తిఁ దలఁతు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 68

వేఱ్క నీ చిత్ర పటములన్ విగ్రహముల,
వేఱు విధముల పోలికల్ వెలయు నెన్న
కమల మన్నింట గుర్తుగాఁ గానిపించు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 69

అల "హరప్ప" "మొహంజొదా" ర్లందు "జువ్వ
దా" ర్ల నెఱుఁగ నగుఁ బరిశోధనలఁ జేయ
నీదు చిహ్నాల టందురు నిజముతల్లి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 70

నాటి 'చుహ్వదార్' 'హరప్ప' 'నార్' 'ఉరు' 'కులి'
'కిష్' మొహంజొదార్ 'అమరి' 'రోం' 'గ్రీకు' 'జాను'
దేశ నాణేల నీ మూర్తి తేజరిల్లు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 71

ప్రాతకాలాన నాదిమవాసు లెలమి
యక్షిణిని, నాగుపామును నధికభక్తిఁ
గొల్చిరానాటి యక్షిణీ! కొనుము ప్రణతి
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 72

వానలను గల్మియును బొందవచ్చుననుచుఁ
దొలుత నాదిమవాసులు దుష్టమైన
జంతువుల నాగులన్ బూజ సల్పిరంట
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 73

ఒకట యక్షిణి మందిరా లుండునట్లు
భారతమ్మున నెలుకగు; భావమరయ
యక్షిణీ లక్ష్మి లొక్కటే యగుదురమ్మ!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 74

యక్షిణియె క్రమముగ లక్ష్మియై యెసంగె
సర్వ సంపద లీయంగఁ జాలియుండె;
నంచు భక్తులు సిన్నెంతు రధికభక్తిఁ,
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 75

దేవతలకు భూతములకుఁ దెలియ నడుమ
ఛాయవలె నొప్పు యక్షిణి చక్కఁదనమె
యాది మానవ పూజనీయమ్ము నయ్యెఁ
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 76

అలర నాదిమ వాసుల యర్చలంది
యక్షిణి యనార్య దేవతయయ్యెఁ దొలుతఁ
గ్రమతఁ గొలిచి రార్యులు నిన్ను గణనఁజేసి
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 77

సింధు లోయలన్ వర్తక శ్రేష్ఠులెల్ల
స్వర్ణ రత్నాళిఁ బొందిరి వనధినుండి;
దాన శ్రీలక్ష్మి పుట్టె సంద్రమున ననిరి;
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 78

అల బృహత్కథా శ్లోకాల నరసి చూడఁ,
గలిమి నాశించి యక్షిణిన్ గొలచినట్లు
తెల్లమగు; నేను దలఁతు నిన్నుల్లమందు;
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 79

అరయ మత్స్య పురాణంబునందుఁ దెలియు,
వేడ్కఁ యక్షిణీ లక్ష్ములన్ వేలువేల
భక్తిఁ బూజించువారు సంపదలుకోరి
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 80

భక్తి భావమ్ము మదినిండ, శక్తి! నిన్ను
యక్షిణీ వటంచు, మఱీ లక్ష్మి వనుచుఁ బలికి
రా బృహత్కథా మత్స్య పౌరాణికులును;
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 81

ప్రముఖ వాత్స్యాయనుని కాల మమరువఱకుఁ
దనర కార్తిక ప్రతిపత్తు దినము నందుఁ
గొల్వఁబడు చుండె యక్షిణి కోర్కె లొసఁగఁ
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 82

తొలుత నాదిమ వాసులు, మలిన నార్య
లెదను యక్షిణిఁ బూజించి రెంతొ భక్తి,
యక్షిణియు లక్ష్మి వేరని యార్యులనిరి
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 83

సింధు నాగరికతఁగన, నాటి సింధులోయ
దరిని పంజాబు గుజరాతు త్రవ్వకాలఁ
గాన వచ్చె నీ రూప విగ్రహము లెలమి
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 84

నాటి సింధులోయలలోని నగ్న విగ్ర
హముల మెడను దామర తూండ్లు, హస్త యుగళి
సంపద కలశాల్ గలిగి నీ ఛాయఁదనరె!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 85

అక్క డక్కడ 'లక్ష్మి' 'శ్రీ' యను పదాలు
కాంతి సంపదైశ్వర్య వేగాలఁ దెల్పు
లేదు రూపమ్ము నీకు ఋగ్వేదమందు;
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 86

అరయ, సంపద కింద్రుడు నశ్వనీ కు
మారులని తెల్పు ఋగ్వేద మంతెగాని,
దేవి వౌ లక్ష్మి! నీ రూపు తెలియరాదు,
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 87

హస్తములు రెంట పద్మమ్ములమరి యుండుఁ
గలశ మభయ ముద్రలు రెంటఁ గలిగియుండు,
శ్రీ! చతుర్భుజ సుందరీ! ప్రేమమూర్తి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 88

శ్రీయు, లక్ష్మియు నొద్దికన్ శ్రేయమెసఁగఁ
బరమ పురుషుని పత్నులై పరగినట్టు
లా యజుర్వేద మందున నమరి యుండు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 89

సంపదలఁ బొందఁగ బలి యొసంగు నట్లు
నాఁడు కనిన 'మొహంజొదార్' నాణెములను,
గనఁగ దేవి యెదుట మేక కానఁబడును,
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 90

అల యధర్వణ వేదాన నార్యులెంచు
లక్ష్మి "మంచిలక్ష్మి" యనార్య లక్ష్మి "పాపి
లక్ష్మి" గాఁ దెలియఁ బడె విలక్షణముగ,
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 91

కలుగనయ్యె నల పురాణ కాలమందు
లక్ష్మి! నీ రూపకల్పన లలిత గతిని!
విగ్రహారాధనలు చాల విరివినందె
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 92

ఉదధిఁ దొలుత 'నలక్ష్మి' యు పిదప 'లక్ష్మి'
యుద్భవం బంది రనియెడు నున్నతోక్తి
వ్రాయఁబడియుండె "లింగపురాణ" మందు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 93

'డన్ గయాన' లో దీపావళిన్ గనంగఁ
జేట వాయించి బయటికి జ్యేష్ఠనంపి
స్వాగతంబులు లక్ష్మికిఁ బలుకుచుంద్రు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 94

ఒనర దీపావళి దినాన నొకట నుంచు
రింద్రుఁడాది సురలు నాఁడె యెసఁగులక్ష్మి
పూజలంచు నధర్వణంబున వచించు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 95

ప్రగతిఁ 'గాంబోడియా' ను పురాతనంపు
టాలయంబున నీ విగ్రహంబు లక్ష్మి!
నేటికిని పూజ లందుచు నెగడుచుండు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 96

'చైన' 'టాంగను' చెంత 'పుషాను' నందు
నాగ మకరాల చిహ్నాల నాణెములను
విసరి పూజింత్రు కలిమికై విపులభక్తి
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 97

స్వర్ణ భూషణ భూషిత! వనధికన్య!
కాంతి మద్భాసితాంగి! శ్రీకాంత! శాంత!
రమ్ము నా యింటికి రయాన రమ్య హృదయ!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 98

మనసు కల్గినఁ గల్గును మార్గమండ్రు,
పేదనోయమ్మ! ప్రోవంగ వేగరమ్ము!
క్షీర సాగర కన్యకా! సిరులనిమ్ము!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 99

శ్రీరమాసతి, పార్వతి, శారదాంబ
రూపముల నొప్పి లోకాల రూఢినేలు
నాది దేవతవమ్మ! నన్నాదుకొనుము
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 100

అల్ల వైకుంఠ పురమున పుల్లకుసుమ
భరిత గంధిల మందార వనములోన
సరసి గట్టున హరితోడ సరసమాడు
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 101

సత్యవంతులు, భక్తులు, సద్గృహములు,
వీరులు, జయధ్వజంబులు, ద్విపగణంబు,
పూల తోటలు, నీ నిలయాలు తల్లి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 102

పెత్తనము రాదు, దుఃఖంబు పెరిగిపోవు,
సభకుఁ బోవ భయమ్మును జంకు కలుగు
నీదయందప్పు వానికి నిజము తల్లి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 103

తల్లి నిందించు, నిజ సతి తలఁప దింత,
బలము తగ్గును, వెగటౌను బలుకు తీరు,
నీదయం దప్పు వానికి నిజము తల్లి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 104

పోక చేయఁడెవండేని రూక లేక
ధనము మూలము జగతికిఁ దథ్యమరయ,
నట్టి ధనమీవ! ధనలక్ష్మి! యార్తుఁ బ్రోవు;
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 105

శ్రీయు, ఘనతయు, గౌరవ స్నేహమ్ములును,
వస్త్ర వాహన ధర్మముల్, వనితనంబు,
నీదు దయ కల్గనబ్బును; నీవె దిక్కు-
కలుము:ల జవరాల! కరుణ( గావుమమ్మ॥ 106

అర్ధములు, రత్నములును, స్వయంవరాలు,
జలజములు, దీపములు, ఛత్రచామరములు,
గోవులు, పొలాలు, నీవుండు తావులమ్మ!
కలుముల జవరాల! కరుణ( గావుమమ్మ॥ 107

సిరుల నిచ్చెదవో తల్లి! చిద్విలాసి!
స్వాంతమున నిన్ను( గొల్చెడి సాధునన్ను
సర్వ సంపదలిచ్చి రక్షణము సేయు
కలుముల జవరాల! కరుణ( గావుమమ్మ॥ 108

మేల్మి బంగారు రంగగు మేన నొప్పి
స్వర్ణ రజిత మాలల( జంద్రుభాతి(దనరి,
పసి(డియే యౌచు భాసించు భాగ్యలక్ష్మి!
కలుముల జవరాల! కరుణ( గావుమమ్మ॥ 109

పూయకే కాయు బిల్వంబు పుట్టె; నదియు
నంత రేంద్రియ బాహ్యేంద్రియములు లేమి(
బారద్రోలెడు నీ దయా ప్రాప్తి వలన
కలుముల జవరాల! కరుణ( గావుమమ్మ॥ 110

అఖిల శుభలక్షణంబుల నాశ్రితాళి
కోర్కెలం దీర్చుచుండెడి కోమలాంగి!
ఆశ్రయించితి దీనుని నాదరించి
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 111

బ్రహ్మరూపిణి! భగవతి! భాగ్యధాత్రి!
ధ్యానసత్వా! దయార్ద్రహృత్పద్మ! పద్మ
భక్త పోషణి! మణి గణ భాసురాంగి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 112

చంద్ర భాసిని! చిద్రూప! ఇంద్రవినుత!
భక్త మానస హంసి! సౌభాగ్యలక్ష్మి!
లేమి బాపుము సిరులిచ్చి కామజనని!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 113

సకల నిగమాంత వినుత! ప్రశాంత మతిని
బలికినాఁడనీ శతకమ్ము భక్తి మెయిని
సకల సంపద లర్థింతు సౌమ్యలక్ష్మి!
కలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ ॥ 114

వఱలు శేలకోన సిద్ధేశు వర జనిత్వఁ
కృష్ణవేణమ్మ లింగయ్య ప్రియసుతుండ
భక్తి కోసంగి సిద్ధేశ్వర ప్రసాదుఁ
గలుముల జవరాల! కరుణఁ గావుమమ్మ॥ 115

జయము శ్రీ విష్ణు హృద్వాసి జయము జయము
జయము సర్వసంపత్ప్రదా! జయము జయము
జయము సర్వాంగ సుందరీ! జయము జయము
కలుముల జవరాలా! కరుణా గావుమమ్మ ॥ 11

సకల సంపత్ప్రాప్తిరస్తు!

శుభం భూయాత్!

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ షిర్డీ సాయిబాబా ప్రింటర్స్, తులసి కాంప్లెక్స్, కోడూరు.